నికి అంధులై చిల్లరశృంగారం, పులుసుడు, అయోమయం మొదలైన వాటిపాలుగావడం అజ్ఞానం. భావనావిభుత్వంతో ఉదాత్తభావప్రకర్ష రూపమైన రొమాంటికు కవిత భారతవర్షసాహిత్యంలో చిరకాలంనుండి ప్రతిష్ఠితమై వున్నదని తెలిపినాను. వాచ్యరమణీయుతాప్రకారమైన యీరొమాంటికు కవిత భారతవర్షదృష్టిప్రకారం సాధారణంగా కొంచె మెచ్చు తక్కువగా భారతవర్షసాహిత్యంలో గుణీభూతవ్యంగ్య కోటిలో చేరుతున్నది. కాళిదాసాదుల్లో గుణీభూతవ్యంగ్యదశ కూడా గడచిసత్వోన్నతిగల వ్యంగ్యదశ కూడా గుణీభూతవ్యంగంకంటెపరిణతమైనది కవితకు భారతవర్ష సాహిత్యంలో చిరకాలంకిందటనే వర్తించగలిగింది. కవితాదశలు జాతులసంప్రదాయాలతో సంబద్ధమయ్యేవున్నవి.

సత్వశ్రేయః పరమత్వాన్ని అనుభవించగలిగిన భారతవర్షం కవితలో తదను రూపమైన వ్యంగ్యదశను దర్శించగలిగింది. యూరోపుఖండంయొక్క యేసంప్రదాయాలపరివర్తనంవల్ల కవితకు ప్రస్ఫుటంగా యీదశాపరిణామం సిద్ధిస్తుంది? అనేవిచారణ నాకిక్కడ అప్రసక్తం. యూరోపుఖండసాహిత్యప్రశంస యింతటితో వదలుతున్నాను.

అని శ్రీ......ఉమాకాన్తవిద్యాశేఖరకృతిలో వాఙ్మయసూత్రపరిశిష్టంలో భావనాధికరణం సమాప్తం.



శ్రీగణేశాయ నమః.

# వాఙ్మయపరిశిష్టభాష్యం.

## ఉపోద్ఘాతాధికరణం.



### పూర్వపక్షం.

అవునయ్యా, యెంకిపాటలను కృష్ణపక్షాన్ని, యేకాంతసేవ మొదలైనవాటిని వాటి ఉపోద్ఘాతకర్తలు ప్రశంసించారు కనుక అవి ప్రశస్తమైనవి. అని అంటారా?

### తటస్థాక్షేపం.

ఈతీరుగావిదితమవుతున్నది. ఈఉపోద్ఘాతాలేఅప్రశస్తాలు. విషయనిమర్శంచేసే ఉపోద్ఘాతాలు కూడదవని కాదు. కాని యివి వేరుమార్గపువి అయివున్నవి. కనుక అప్రశస్తాలన్నాను. ఆసంగతివివరిస్తాను. పూర్వకాలంలో కొందరు కృతిశాస్త్రరాజులను ఆశ్రయించి ధనం సంపాదించేవాళ్లు. ఈకాలపు కృతికర్తలు ఉపోద్ఘాత కర్తలను ఆశ్రయించి కీర్తి సంపాదించ యత్నిస్తున్నారు. దీంట్లో ఒకరిజుట్లోగుండా ఒకరు వెళ్లిపోతున్నారు. ఒకరు రామలింగారెడ్డివారిచేత వ్రాయిస్తే మరియొకరు నల్లవాండ్లకంటె తెల్లవాండ్లైతే బాగుంటుందని పెద్దయెత్తెత్తిఅడివి బాపిరాజప్రభృతులవలె తెల్లవాం చేత వ్రాయిస్తున్నారు. కృతికర్తలు పొగడడం నిర్వివాదం. యెంకిపాటలకర్తమట్టుకు యెంకిపాటలకర్త వరుసగా తనపాటలుమొదలువిన్నవారిని,బుజాలుతట్టినవారిని, తననుపొగడినఅనసూయ,

సుజనరంజని, జ్యోతి, సాహితి యీపత్రికల ప్రవర్తకులను శారదను వరసగా నమస్కారాలపాటతో కీర్తించాడు. పాటలువిన్న శ్రీ శ్రీ శ్రీ రాజా వెంకటాద్రి అప్పారావుబహద్దరుగారివంశం ఆచంద్ర తారార్కం నిలవవలె నని ప్రార్థించాడు. అభినవాంధ్ర కవిమండలికి, తనను గౌరవించినందుకు ఆంధ్రపండితమండలికి మొక్కువేశాడు. ఇక ఉపోద్ఘాత రచయితకు నమస్కారాలు ఆగవలసినది లేదుగదా. అన్నిటికంటె చిత్రం తపాలాపెట్టె 110 నెంబరుగల జీ. యస్. శాస్త్రి అండు కంపెని అనే కంపెని యజమానులను శ్రీగంటి సూర్యనారాయణ శాస్త్రివారిని "తర్కవ్యాకరణశాస్త్రవేత్తలగు బ్రహ్మశ్రీ గంటి సూర్య నారాయణశాస్త్రులుగారు తమకు తామెకోరి" అని వ్రాసి చివరన కృతజ్ఞతాసమర్పణంచేశాడు. వీరు తర్కవ్యాకరణశాస్త్రవేత్తలౌనా కాదా? అని నావిచారణగాదు. అట్లాటిశాస్త్రవేత్తలైతే సంతోషమే. మనదేశంలో యెందరు తర్కవ్యాకరణవేత్తలుంటే అంతశ్రేయస్సు గదా కాని యీపాటలు అచ్చువేయించడానికీ తర్కవ్యాకరణశాస్త్రాలకూ యేమీ సంబంధం లేదు. తర్కవ్యాకరణశాస్త్రవేత్తలుకూడా ఈపాటలను మెచ్చుకొన్నారు అని తనను తానుపొగడుకొనడం ఉద్దేశంగా కనబడుతున్నది. అదే నిజమయితే ఆవుద్దేశం వ్యర్థం. యెందుకంటే కావ్యసౌందర్యం తర్కానికిగాని వ్యాకరణానికిగాని సంబంధించింది గాదు. అందుకే

"నైనం వ్యాకరజ్ఞమేతి పితరం న భ్రాతరం తార్కికం"

(కావ్యకన్య తండ్రి అని వైయాకరణుణ్నీ, అన్నయ్య అని తార్కికుణ్నీ సమీపించదు) అని బిల్హణు డన్నాడు.

"శబ్దార్థ శాసనజ్ఞాన మాత్రేణైవ న వేద్యతే,
వేద్యతే స హి కావ్యార్థ తత్వజ్ఞై రేవ కేవలం"

(వ్యాకరణం, తర్కం, చదివితే కావ్యజీవితస్వరూపం తెలి యదు. అయితే కావ్యార్థ తత్త్వజ్ఞులే దాన్నికనుగొన గలరు)అని ఆనంద వర్ధనుడు చెప్పుతున్నాడు. కాని యీ ఔచిత్యజ్ఞానమంతా కోల్పోయి తన సంతోషాన్ని పట్టలేక తర్క-వ్యాకరణశాస్త్రవేత్తలు అని పొగడి నాడు. ఈతీరుగా యిస్తివాయినం పుష్పకోటివాయినం అని కృతిక ర్తలు పొగిడి కొన్నిస్థలాల్లో ఆశ్రయించి తమను పొగిడించుకుంటు న్నారు. ఆశ్రయించిన కృతికర్తలను ఉపోద్ఘాతకర్తలు శ్లాఘిస్తున్నారు. లేదా ఆశ్రయించిన దోషానికి వారికండ్ల నీళ్లు తుడవవలె నని వారిని కొనియాడుతున్నారు. ఈఉపోద్ఘాతక ర్తలు కృతికర్తలపేరుతో పాటు మాపేరుగూడా కష్టంలేకుండా వ్యాప్తిలోకి వస్తుందని ఉపోద్ఘాతం వ్రాయడమే గొప్ప అనుకొని, భువనమోహనలు, విశ్వమోహనలు వేసి వ్రాస్తున్నారు. వీరు పొగడంలో ఒకరిజుట్లో నుంచి ఒకరు వెళ్లిపో తున్నారు. యెంకిపాటల ఉపోద్ఘాతకర్త

"కవితాకల్ప ప్రసూనమునందలి"
"కవితాకల్ప ప్రసూనవిషయము"
"తేనెవాకలనూరించు"
"దివ్యప్రసూనరాజములుగాని"
"అమృతఘుటికలు"
"పుష్పరాజములు"
"దివ్యసౌరభసురభితములై"
"లాలిత్యసౌకుమార్యసౌరభ్యములను వెదజల్లుమంజరులను"
"దివ్యమహిమా విలసితములు, పరిణతీవిలసితములు"

అని శబ్దవాచ్యతాదోషానికి పాలై

"దివ్యమహిమా విలసితములు, పరిణతీవిలసితములు".

అని తప్పులుకూడా వ్రాసి పుష్పాలను వెదజల్లడమే కాకుండా

"ఈవిధములగు దివ్యప్రసూనముల నర్చించి మనల నానందసా
గరమున నోలలాడించుటయును చూడగలిగిన ననుబోటుల
జీవితములు ధన్యములు ధన్యములు."

అని పొగడ్తలో చివర చుట్టెక్కినాడు. కావ్యకుసుమావళి ముఖబంధ
కర్త యిన్నిమాట లెందుకు "This is the age of Venkataparva
theeswara Kavulu" ఇది వేంకట పార్వతీశ్వరకవుల సమయం
అని యీకాలాన్నే వేంకటపార్వతీశ్వరకవులవశం చేశాడు ఇక
యేకాంతసేవ ఉపోద్ఘాతకర్త

"నూతనాంధ్రసారస్వతములో నిట్టి కావ్యము వేఱొక్కటి
లేదని నానమ్మకము" అని అన్నాడు.

"శ్రీనాథుని యాఖండచమత్కృతియే యీకవికూడా కలిగి
యుండెనని తలచెద."

అని బాపిరాజ తొలకరి పీఠిక వ్రాసిన కూల్డ్రేవారు అన్నారు.

"గుణమున నింతకంటె శ్రేష్ఠములైన కృతులు మనభాషలో
పెక్కులులేవు. ఈమహనీయసృష్టి ప్రభావమునకును ప్రకాశ
మునకును జేరినవారిలో నీకవులు ముఖ్యముగ గణనీయులు.
ఆర్యాంగ్లేయాది వాఙ్మయములసారములబీల్చి" అని లక్ష్మీకాంత
తొలకరి ఉపోద్ఘాతకర్త రామలింగారెడ్డివారు పొగడుతున్నారు. కనుక
ఇట్లా ఆశ్రయించి పొగిడించుకొన్న పీఠికలు, పీఠికలు వ్రాయడమనే
గొప్పపదవి దొరికింది యింతే చాలునని పీఠికాకర్తలు వ్రాసేపొగడ్తలు,
విచారించదగ్గవికావు. గనుక ఈపీఠికలు అవిచార్యమంటున్నాను. మమ్మి
కపొగడుతారుగదా అనికృతికర్తలు, పీఠికవ్రాయడమనే అపూర్వగౌరవం
యిచ్చినందుకు ప్రత్యుపకారంగా స్తుతిచేయవలెనని పీఠికాకర్తలు వీరారు
పెద్దలంటే మీరు పెద్దలని అన్యోన్యగౌరవం ప్రకటించుకున్న యీ
ప్రశంసలు విచార్యంగావు.

కృతికర్తలు ఉపోద్ఘాతకర్తలను ఆశ్రయించి స్తుతిస్తే కృతికర్తలకంటె యెక్కువగా ఉపోద్ఘాతకర్తలు దివ్యులు మధురలు అనందలు వేసి పొగడుతున్నారు, ఇవి పాటించదగ్గవి కావంటే.

సమాధానం.

తెలుపుతున్నాను; పూర్వపక్షానికితటస్థాక్షేపానికి కలిపి ప్రతివచనం చెప్పతాను. కృతికర్తలందరు ఉపోద్ఘాతకర్తలను ఆశ్రయించారో లేదో పొగడినారో లేదో చెప్పలేను. చాలామంది కృతికర్తలు ఉపోద్ఘాతకర్తలను ఆశ్రయించడం నేనెరుగుదును. కొన్ని సంవత్సరాలక్రిందట ఒక కృతికర్త పీఠిక వ్రాయమని నన్ను ప్రార్థించి చాలా పర్యాయాలు నన్ను కలుసుకొని నాకుపుస్తకం యిచ్చాడు. నేను మీాకు పనికివచ్చే పీఠిక వ్రాయలేనని ఆపుస్తకం చదివిచెప్పినాను. తరువాత కొన్నాళ్లకు అపుస్తకం ఒక ప్రసిద్ధుడి ఉపోద్ఘాతంతో ప్రశంసలతో బయటికివచ్చింది. ఒక పెద్ద పద్యగ్రంథాన్ని ఆంధ్రీకరించిన పండితుడు ఉపోద్ఘాతంవ్రాయమని నన్ను కోరినాడు. నేను గుణదోషవిచారణలు కొండూచేస్తాను. మీాపుస్తకం పంపండి అన్నాను. నాకాపుస్తకం ఆయన పంపలేదు.

నాతో అదివరకు పరిచయంలేని మరివొకరు మాయింటికివచ్చి అచ్చుపడని తనపుస్తకాన్నిగురించి కొన్నిపంక్తులు వ్రాసియియ్యమనికోరినాడు. తనపుస్తకంలో కొంతవినిపించాడు. ఆపుస్తకంయొక్క అనావశ్యకత, అనౌచిత్యం తెలపగా ఆయన ఉపోద్ఘాతవిషయకమైన తనకోరికను ఉపసంహరించుకొని పోయినాడు.

ఈమధ్య కొందరు కృతికర్తలు తనపుస్తకాలను అట్టలుకట్టనివాటిని పంపి ముద్రాలయంలోనుండి యింకా బైటికి రాలేదు. మీాపీఠికవచ్చేదాకా అట్టకట్టించకుండా వుంటాము కనుక సాధ్యమైనంతత్వరలో వ్రాసి పంపవలెనని కోరినారు.

"నా పీఠిక మీఉద్దేశాలను అనుసరించి వుండనను కొంటాను కావలెనంటే వ్రాసిపంపుతాను. నాకు వ్యవధి కావలెను".

అని ప్రతివచనం వ్రాశాను. వారు మళ్లీ ఉపోద్ఘాత ప్రస్తావనతో ఉత్తరం వ్రాయలేదు; ఈతీరుగా పీఠికలకోసం కృతికర్తలు ఆశ్రయించడం సాధారణమైన పనిగా వున్నది. అయితే యెంకిపాటలు యేకాంతసేవ మొదలైన వాటికి ఉపోద్ఘాతాలు ఆశ్రయించి స్తుతించి వ్రాయించినవో కావో నాకు తెలియదు. వారేకారణంచేత వ్రాసినా వారు వ్రాసినవ్రాతలకు నేను బాధ్యుణ్ణిగాను. సర్వదేశాలకు సర్వకాలాలకు అన్వయించే సత్యాలతో గర్భితమైన భారతీయ సాహిత్యవిచారణలను విశదపరచి నానిర్ణయాలను తెలిపినాను. అవి అసత్యమని యెవరైనావాదిస్తే వాటికి సమాధానం వుంటే చెప్పుతాను; లేదా నామాటలు అసత్యమని ఒప్పుకొని వారి వాక్యాలను వినయంతో శిరసావహిస్తాను అని మాత్రం మనవిచేస్తున్నాను.

అని శ్రీ...ఉమాకాన్తవిద్యాశేఖరకృతిలో వాఙ్మయసూత్రపరిశిష్టంలో ఉపోద్ఘాతాధికరణం సమాప్తం.



41

శ్రీ గణేశాయ నమః.

# వాఙ్మయ పరిశిష్ట భాష్యం.

## దోష సామ్యాధికరణం.



అవునయ్యా, బంగాళీల్లో, పాశ్చాత్యుల్లో ఇట్లాంటివి వున్నవి. వాటిని చూచి వీరువ్రాశారేమో బంగాళీలో ఇంగిలీషులోవుంటే అవి మంచివిగదా వాటినిచూసి వ్రాసినవిగూడా మంచివే కావలెను అని అంటారా! చెప్పుతున్నాను. అవును వాటినిచూచి వీరు కొన్ని వ్రాసి వుండవచ్చును.

మనదేశంలో పేరుచెప్పకుండా యితరుల అభిప్రాయాలను వాక్యసంచయాలను, రచనలను, తాము వ్రాసినట్లు వ్రాసి ఆత్మవంచనా లోకవంచనా చేయడం తరుచుగా కనబడుతున్నది. దానికి ఉదాహరణ చూపుతాను. గొల్లపూడి శ్రీరామశాస్త్రివారు రసవిచారమని భారతి సం. 3 సం. ౧ లో ఒకవ్యాసం వ్రాస్తూ...

ఇక నాట్యమునందు శాంతమునకు స్థానము లేదను వారి మతమునుగురించి చర్చించెదము గాక. భరతాదులు శాంతమునకు స్థాయి భావనిరూపణ మొనరింపలేదు. కనుక శాంతమును రసములలో పరిగణించుటకు వీలులేదని కారణము చెప్పుటకు వలనుపడదు. ఆయన నిర్వేదము శాంతమునకు స్థాయి యని నుడివియున్నాడు. నాట్యమునందెనిమిదిరసములని చెప్పిన మమ్మటాచార్యుడును

"నిర్వేదస్యా మంగళప్రాయస్య ప్రథమ మనుపాదేయ
త్వేఽపిఉపాదానం వ్యభిచారిత్వేఽపి స్థాయిత్వాభిధా

నార్థం తేన నిర్వేద స్థాయిభావః శాంతోఽపి నవమోస్తిరసః."
అని వచించియున్నాడు. పోనీ శాంతమునకు విభావాదిసామగ్రి గలదా అని యందురా? కలదు. వైరాగ్యపరమేశ్వరానుగ్రహసత్పురుషసేవాదులు విభావములు. యమనియమాదు లనుభావములు. మతిస్మృతిచింతాధృతివితర్కాదులు సంచారిభావములు. అయినను సర్వజనాదరణీయము కాకపోవుటచే నశ్లాఘ్యమందురా? రాగద్వేషకలుషితాంతఃకరణులగు వారికి రుచింపకపోయినను వీతరాగులకు ప్రేమాస్పదమే గదా. రాగద్వేషకలుషితులకు రుచింపమి హేతువు నంగీకరించెదమేని శృంగారము వీతరాగులకు రుచింపకపోవుటచే నద్దానికిని అంతః అసిద్ధి అనివార్యమేఅగును. కనుక రసములు తొమ్మిదని స్పష్టపడుతున్నది. ఈశాంతరసము శ్రవ్యమునందు అంగీకరింపబడినను అభినేయమగు నాట్యమున నిషిద్ధమేగదా అను నాక్షేపమునకు సమాధానము మిగిలియున్నది. ఇద్దానికి జగన్నాథపండితులు చెప్పిన జవాబెంతయు శ్లాఘాపాత్రమగుటదాని నిట వివరించెదగాక"

అనివ్రాశారు. "తొమ్మిదని స్పష్టపడుచున్నది." అనేవరకు వీరుఆక్షేపాలకన్నిటికీ స్వయంగా సమాధానాలు చెప్పినట్లు, చివరదానికి జగన్నాథుడి జవాబును చెప్పబోతున్నట్లు, ఇదంతా ఈవ్యాసకర్తే వ్రాసినట్లు మనకు ఈమాటలవలన బోధపడుతున్నది. కాని సత్యం విచారించగా పైఆక్షేపాలు వికల్పించుకొన్నది గాని వాటికి సమాధానం చెప్పిందిగాని, వీరు గాదని స్పష్టపడుతున్నది. రత్నాపణంలో కుమారస్వామి సోమయాజి ఆఆక్షేపాలను వికల్పించుకొని సమాధానంచెప్పినాడు.

"నాట్యః నిర్వేద ఏవ శాంతస్యస్థాయి భావ ఇతి మునినాంగీకృతత్వాత్. తచ్చానేక రససాధారణస్య వ్యభిచారిణః సతోపి అమంగళ ప్రాయత్వేపి సజాతీయాగ్రగణ్యత్వం ప్రాధాన్యేన కంచి ద్రసవిశేషం ప్రతి అసాధారణస్థాయిత్వం బోధయితు

మితి ప్రతిపాదనాత్. తదుక్తం కావ్యప్రకాశే నిర్వేదస్యా మం
గళప్రాయస్య ప్రథమ మనుపాదేయత్వే ప్యుపాదానం వ్యభిచారి
త్వేపి స్థాయిత్వాభిధానార్థం తేన నిర్వేద స్థాయిభావః శాంతోపి
నవమోస్తిరస ఇతి...నద్వితీయః వైరాగ్యాదిసామగ్ర్యాః సులభ
త్వాత్. తథాహి. వైరాగ్యపరమేశ్వరానుగ్రహ ప్రాచీనకుశల
పరిపాకసత్పురుషసేవా వేదాంతవిచారాదయోవిభావాః యమ
నియమాదయోనుభావాః, మతిస్మృతి చింతా ధృతివితర్కాద
యోవ్యభిచారిణః. నతృతీయః రాగద్వేషకలుషితాంతః కరణా
నామచర్వణీయత్వేనఅశ్లాఘ్యత్వేపి వీతరాగాణాంతదభావాత్.
యదికతిపయాశ్లాఘ్యత్వమాత్రేణ రసత్వాత్ ప్రచ్యవేత, తర్హి
వీతరాగాణామశ్లాఘ్య ఇతి శృంగారోపి ప్రచ్యవతాం......
తస్మాన్నవైవరసా ఇతి సిద్ధం" (రత్నా.)

అని కుమారస్వామి సోమయాజి రత్నాపణంలో వివరించాడు.

ఈపంక్తులనే శ్రీ రామశాస్త్రివారు తనవిగా భారతిలో వ్రాశారు.
ఇక వీరు ఈకాలపువారి రచనలను దొంగిలించి ఈవ్యాసానచేర్చిన
అంశాలు తెలపడం అనవసరం గనుక ఇంతటితో వదలుతున్నాను.

చివరకు పత్రికల్లో వేసే హాస్యాలుకూడా పేరుచెప్పకుండా ఇతరు
లవి స్వీకరించి తమవిగా వంచనచేస్తున్నారు. "ఆంధ్రపత్రికకు ప్రత్యేకం"
అనేశీర్షికకింద మూడు తమాషాలు కనబడినవని ఆనాడే వెలువడిన
తెలగపత్రికలో యీతమాషాలే కనబడ్డవని, తమాషాకర్తలు తమా
షాల మాన్యకలను పేర్కొందురుగాక అని, శ్రీమల్లాది వేంకటకృష్ణ
శర్మవారు కలిశకం 5028 మార్గశీర్ష శుద్ధసప్తమిగురువారం (క్రీ. శ.
1927 డిసెంబరు 1-వ తేది) త్రిలింగపత్రికలో వ్రాసినదాన్ని చదివినాను.
ఇట్లా చిల్లరవ్యాసాల వద్దనుండి విషయప్రధానమైన విచారణలదాకా
అనేకులు ఇతరుల వాటిని దొంగిలించి పేర్లుచెప్పకుండా తమవైనట్లు

ప్రకటించుకొంటున్నారు. పత్రికలవ్యాసాల్లోనే గాక సాధారణపద్య కృతుల్లోను, గద్యకృతుల్లోను ఇతిహాసాల్లోను ఈపని విపులంగా కన బడుతున్నది.

"దుష్టకీర్తనకాంతార దూరగమన
పాంసుల యగువాక్కు పరిశుభ్రపఱతు నిక
హరికథాలాపగంగ రంగమ్మతల్లి
ప్రేమకల్పకవల్లి సాధ్వీమతల్లి"

అని జీవయాత్రలో శ్రీ కంచనపల్లి కనకమ్మవారు తనపద్యంగా వ్రాశారు.

"అసత్కీర్తన కాంతార పరివర్తన పాంసులాం,
వాచంశౌరి కథాలాప గంగ యైవపునీమహే."

అని శ్రీ భాగవతకర్త వ్రాసిన దాన్నే యీమె తనదిగా వ్రాసుకొన్న ది. ఆంధ్రుల్లో చాలాకాలంనుండివున్న యీపేరుచెప్పకుండా యెత్తి వ్రాసుకొనే పాడు ఆచారం నేటికాలాన విస్తరించింది. తక్కినవాటిని విస్తర భీతిచేత యిక్కడ ఉదాహరించకవదలుతున్నాను.

సంప్రదాయావిచ్ఛేదానికి విద్యానాథాదులవంటివారు స్వీకరిం చిన ప్రసిద్ధశాస్త్రపంక్తుల విచారణ యిక్కడప్రసక్తించదు. ఆశాస్త్ర గ్రంథాల్లో సయితం సాధారణంగా "ఇతి భాష్యకారః,ఇతివృత్తికారః, లోచనకారైరుక్తం, తదుక్తందండినా" అని యిట్లాతాము స్వీకరించిన వాటికర్తలను తెలుపుతూనేవచ్చారు. సూత్రకర్తలు సయితం ఇతరుల అభిప్రాయాలను తెలిపినప్పుడు వారిపేర్లు ఉదాహరిస్తూవచ్చారు. రఘు వంశానికి అన్వయబోధిని వ్రాసిన శారదారంజనరాయలవారు

"ఇంద్రోవహ్నిః పితృపతి ర్నిఋతిర్వరుణోనిలః,
ధనదః శంకరశ్చైవ లోకపాలాః పురాతనాః"

అనే అగ్నిపురాణశ్లోకాన్ని "అధనయునసముత్థం" అనేశ్లోకంకింద ఉదా హరిస్తూ రాధాకాంతులవారు కల్పద్రుమంలో ఉదాహరించినదాన్ని

స్వీకరించాడని తెలిపినాడు. అగ్నిపురాణంలో దీన్ని శారదారంజనుడు తానే చూసినట్లు ఉదాహరించలేక కాదు. రాధాకాంతు డుదాహరించినది చూసి ఉదాహరించాడు గనుక అట్లా తెలిపి విద్యాకృషి గౌరవం కనబరచాడు. ఇక ప్రకృతానికి వస్తాను.

ఉక్తవిధాన ఇతరులనుండి రచనలను గ్రహించి వారిపేరు చెప్పకుండా తాము వ్రాసినట్లు ప్రకటించి ఆత్మవంచన లోకవంచన చేయడం మనదేశంలో చిరకాలంకిందనే ఆరబ్ధమయి యిప్పుడుమితిమీరి పోయింది. ఇట్లా యిప్పుడు దొంగిలించి అసలువారిపేరు చెప్పకుండా వ్రాసిన రచనలను రచనైక దేశాలను, తెలియక పోవడంచేత పత్రికల ప్రవర్తకులుకృతిపతులు ఆవ్రాతలను అట్లానే ప్రకటిస్తున్నారు. అవి కృతికర్తలవనుకొంటున్నారు. ఆర్జవం, సత్యపరాయణత వదలి పరిణతిలేని రచయితలు భారతీయసాహిత్యతత్వానికి అంధులైన పద్యకర్తలు స్వకీయ విచారణలేని వ్యాఖ్యాతలు అనేకులు ఈతీరుగా బయలుదేరి దేశాన్ని దేశంయొక్క విజ్ఞానవికాసాన్నివంచిస్తున్నారు. కొందరు హిందీలో యేదో చూసి ఇది వకకొత్తగావుంటుందని దీనితో మనం కొంత పేరు సంపాదించవచ్చునని దాన్నిపత్రికలో వేసి సంతోషిస్తున్నారు. బంగాళీలో యేదో చూచి దీనితో కొంతపేరు పొందవచ్చునని దాన్ని పత్రికల్లో వేసి కొందరు ఆనందిస్తున్నారు. ఈతీరుగా నాపేరు పత్రికల్లోపడుతున్నదని నాకు కీర్తి వస్తున్నదని యెవరిబులుపు వారు తీర్చుకొంటున్నారు. గాని అందువల్ల దేశానికి దేశీయులకు దేశవిజ్ఞానానికీ జరిగే వంచన తెలిసికొనడంలేదు.

## పూర్వపక్షం.

అవునయ్యా, ఇతరు లవి యెత్తివ్రాసుకొంటే యెవరికేమి హానీ లేదు అది నింద్యంగాదంటే,

—ం సమాధానం.

చెప్పుతున్నాను, స్వకీయపరిపాకబలంచేత, కృషివశాన, కొన్ని భావాలు, అంశాలు కొందరు పరిణతచిత్తులు ప్రకటిస్తారు. వాటినితరులు యెత్తి వ్రాసుకొనేటప్పుడు వారిపేరుచెప్పడం, చిత్తపరిపాకాన్ని, కృషిని గౌరవించడమేకాక విజ్ఞానప్రవృద్ధికి హేతువుకూడాఅవుతున్నది. ఇవి వీరిభావాలు, ఇవి వీరు కనుగొన్న అంశాలు, లోకకల్యాణానికి విద్యావర్ధనానికి అనుకూలమైన భావాలను, అంశాలను నేను కొన్నిటిని ప్రకటింతును గాక! అని చోదన కలగగలదు. ఇట్లాటినూతనాంశాలను కనుగొనడం, భావాలను ప్రసాదించడం విద్వద్గోష్ఠులలో విద్యాభ్యాసంచేసి ధ్యానబలం సమకూర్చుకొన్న పిమ్మటగానిజరగదు. ఈతీరుగా ఉత్తమ విద్యావ్యాప్తి, నూతనాంశాల, భావాల, ఉపలబ్ధి మనకు ప్రాప్తించ గలవు. యేమీ లేక పేరుచెప్పకుండా యెత్తివ్రాసుకోవడంవల్ల చిత్త పరిపాకాన్ని, కృషిని అగౌరవించడమేకాకుండా, నూతనాంశాలు, భావాలు ప్రసాదించే శక్తి జాతికినశించి విజ్ఞానకృషికుంఠితమై యెత్తి వ్రాసుకొనే దశతోనే అది సమాప్తమవుతున్నది. పేరుచెప్పకుండా యెత్తి వ్రాసుకొనడమే విద్య అనుకొనడంవల్ల విద్యావంచన సంభవిస్తున్నది. ఈతీరుగావిద్యాజాడ్యం, తనది కానిది తనదిఅనడంవల్ల లోకవంచన ఆత్మ వంచన ఆపతితమవుతున్నవి.

అంతేగాక భారతీయులము ఆర్యులమైన మనము ఆంధ్రులము స్వకీయమైన భారతీయసంస్కారంయొక్క మహిమను యెంతవరకు దర్శించాము ? ఈతీరుగా హిందీ, బంగాళీ, మరాటీ మన కెన్నాళ్లు శరణ్యం? ఇట్లా అక్కడా యిక్కడా యేదో అపహరించి విద్యాజాడ్యంతో యెన్నాళ్లు సంచరిస్తాము ? భారతీయవిజ్ఞానోన్మేషోద్యమంలో ఇతరుల అంటే బంగాళీలు మరాటీలు మొదలైనవారియొక్క కృషి ఫలాన్ని పిరికిగా సంగ్రహిస్తుండడంతప్ప ఆఉద్యమంలో మనము కార్య

కర్తలుగా నిల్వవలసిన యోగ్యత మనకుఅవసరంగాదా? అని మనను మనము పరిశోధించుకొనడం ఆవశ్యకమని మనవిచేస్తున్నాను. ఇతర భాషల్లో ఉపాదేయగ్రంథాలుంటేతర్జుమాచేసి వాఙ్మయాన్ని సంపన్నం చేయవచ్చును. కాని ఆగ్రంథకర్తలపేరు చెప్పకుండా వాటిని యెత్తివ్రాసి ప్రకటించడం, అదేవిద్య అనుకొనడం, ఆత్మవంచన, విజ్ఞానవంచన, లోక శ్రేయోవంచన అవుతున్నవి.

ఇంతకూ చెప్పదలచిందేమంటే యితరుల రచనలనుచూసి పేరు చెప్పకుండా యెత్తివ్రాసుకొన్నవి అనేకంవున్నవి. నేనిప్పుడు విచారిస్తున్న వనకుమారి, యేకాంతసేవ, యెంకిపాటలు మొదలైనవి పాశ్చాత్యు లనుండి బంగాళీలనుండి పేరుచెప్పకుండా యెత్తి వ్రాసుకొన్న వాట్లో అను కరించినవాట్లో చేరినా చేరకున్నా వాటి అనౌచిత్యాలు, అనౌచి త్యాలుకాకపోవు. పులుముడు, శబ్దహాచ్యత, అయోమయత్వం, అసం బద్ధత, అనుచిత చ్ఛందస్సు, వికృతభాష, పాత్రసృష్ట్యభావంచేత ఆత్మ నాయకత్వంచేత కలిగే దృష్టిసంకోచం, చిల్లర శృంగారం, క్షుద్రత్వం యివి యెక్కడవున్నా పాశ్చాత్యుల్లోవున్నా బంగాళీలలోవున్నా దోషాలేనంటున్నాను. దోషసామ్యమే నంటున్నాను. ఇవి పాశ్చా త్యులకృతుల్లోగాని బంగాళీలకృతుల్లో గాని మరెక్కడనైనాగాని వున్నట్లు మీకు కనబడితే అక్కడక్కడల్లా నావిచారణలు వినిపించ వలెనని ప్రార్థిస్తున్నాను. దోషా లెక్కడవున్నా అవి సిద్ధాంతాల సత్యాన్ని బాధించవు.

అని శ్రీ......ఉమాకాన్తవిద్యాశేఖరకృతిలో వాఙ్మయసూత్రపరిశిష్టంలో దోషసామ్యాధికరణం సమాప్తం.



శ్రీ గణేశాయ నమః.

# వాఙ్మయపరిశిష్టభాష్యం

## చిహ్నాధికరణం.



### పూర్వపక్షం.

అవునయ్యా, నేడు రవీంద్రుడు, మహాత్ముడు, ఇట్లాటి గొప్ప వారు ఉద్భవించారు. ఉచ్ఛదశ మళ్లీ వచ్చేటట్లు కనబడుతున్నది. అట్లానే ఆంధ్రదేశంలో గూడా ఈకొత్త పద్యకర్తలు, శుభచిహ్నమని యెందుకను కోగూడదు. అని అంటారా?

### సమాధానం.

చెప్పుతున్నాను. ఆ దేశాలమాట నేను చెప్పను. అక్కడివిశ్వవిద్యాలయాలవిధానంలో భారతీయసంస్కారం ఇట్లా హీనంగా లేదు. ఆంధ్రదేశంలో అట్లాటి శుభచిహ్నలకు అవకాశం లేదు. ఇక ముందు కలుగుతుందేమో చెప్పలేను. ఆంధ్రదేశంలో చిరకాలం కిందటనే భారతీయసంస్కారం క్షీణించింది. నన్నయాదులు మనకు ఇచ్చిన భారతాదులు సయితం స్వరూపం గోల్పోయిన వికారాలు. నన్నయాదుల భారతం, భాస్కరాదుల రామాయణాం, భారతరామాయణాల శుష్కకృతులుగాని భారతరామాయణాలు గావు. ప్రాచీన గ్రంథాల్లో యేపురాణమూ మనకు యథార్థస్వరూపంతో లభించలేదు. నన్నయ తిక్కన యెఱ్ఱాప్రగడ రచించిన భారతకథల సంగ్రహం మూలమహాభారతంయెదుట "అనంతరత్నప్రభవమైన" హిమాలయం ముందుచిల్లరరాళ్ల గుట్టవలె వున్నది.

శ్రీ ఆనందముద్రాలయంవారు ప్రకటించిన శ్రీ తేవప్పెరుమాళ్లయ్య కృతి రామాయణం అమూలవాక్యాలతో అక్కడక్కడా కూడివున్నా మూలంయొక్క యథార్థస్వరూపాన్ని చాలామట్టుకు చూపుతున్నది. ఇట్లాటివి స్వల్పసంఖ్యాకాలుమాత్రమే మూలంయొక్క యథార్థస్వరూపాన్ని ప్రదర్శిస్తున్నవి. గ్రంథాల యథార్థస్వరూపం దర్శించినప్పుడే వాటిని మనము చదివినవారమవుతున్నాము. నన్నయాదులభారతం చదివినామంటామా? మనము భారతం చదవనివారమే అవుతున్నాము. భాస్కరాదులరామాయణం చదివినామంటామా? మనకురామాయణస్వరూపం గోచరించనిదే అవుతున్నది. ఇక భారతీయకావ్యకోటిలో అధమాలనదగిన మనువసుచరిత్రాదులచేత కావ్యవిషయాన ఆంధ్రదేశం వంచితమై నేటికీ ఆంధ్రదేశం కథాసంగ్రహాల, అధమకావ్యాలదశను దాటలేదు. ఇక ప్రసిద్ధభారతీయ విద్యాస్థానాలు చిరకాలం కిందటనే నశించినవి. మద్రాసు విశ్వవిద్యాలయం వచ్చినప్పటి నుండి పాఠశాలల్లో మనకీజీవం గోల్పోయిన పురాణకథలే యీఅధమకావ్యాలే సర్వభారతీయ వాఙ్మయం, సర్వభారతీయ సంస్కారం అయినవి. సంస్కృతంద్వారా యెవరో కొందరు శిక్షితులైనా అప్రశస్తమైన అభ్యాసమార్గాలవల్ల, విద్యాలయాల్లో అనుచితవిద్యాసరణులవల్ల, ఆశిక్షసయితం దేశంయొక్క సాధారణదశను దాటజాలలేదు. విశ్వవిద్యాలయపుఅంధతవల్ల భారతీయసంస్కారం సంపూర్ణంగా విద్యాశాలల్లో ఖండితమయింది. ఆత్మీయసంస్కారం వున్నప్పుడే పరసంస్కారసమ్మేళనం నూతనదృష్టివికాసాన్ని పరసంస్కారాన్ని ఆత్మీయంచేసుకొనగలశక్తిని సమకూరుస్తుంది. లేదా స్వత్వమేనశించి పరసంస్కారదాస్యం సంభవించి జాతికి మూలక్షయమే ఫలమవుతున్నది. మన ఆంధ్రదేశంలో విద్యాస్థానాల్లో భారతీయసంస్కారం నశించిన యీదశలో మనము గర్వించ దగ్గది యేమీ లేదంటున్నాను. ప్రకృతిని గుడ్డిగాను

పురుషుణ్ణికుంటి గాను చిత్రించిన ఒకపటాన్ని బందరులో ఆంధ్రుల కళాశాలలోవున్న ఒక బంగాళీ గీశాడని అది కొత్తపద్ధతిగా బాగావున్నదని ఒకమిత్రుడు నాతో అన్నాడు. అది సాంఖ్యదర్శనంలో ప్రసిద్ధవిషయమని

"పురుషస్యదర్శనార్థం కైవల్యార్థం తథా ప్రధానస్య
పంగ్వంధవదుభయోరపి సంయోగఃతత్ కృతఃసర్గః" (సా. కా)
"అంధేనపంగుః స్కంధమారోపితః ఏవం శరీరారూఢ
పఙ్గుదర్శితేన మార్గేణ అంధోయాతి పంగుశ్చ అంధ
స్కంధారూఢః. ఏవం పురుషే దర్శనశక్తిరస్తి పంగు
వన్నక్రియా. ప్రధానే క్రియాశక్తిరస్తి. అంధవన్న
దర్శనశక్తిః." (గౌ. పా.)

(పురుషుడు దర్శనార్థం, ప్రధానం కైవల్యార్థం, పరస్పరంకూడుతున్నారు. వీరిద్దరికి కుంటికి గుడ్డికి కలిగినట్లు సంయోగంకలుగుతున్నది. ఈసంయోగంవల్ల యేర్పడ్డది సృష్టి.) అని.

(అంధుడు కుంటిని బుజమెక్కించుకొన్నాడు. కుంటివాడు చూపిన మార్గాన అంధుడు నడుస్తాడు. అంధుడి బుజమెక్కిన కుంటిగూడా నడిచినవాడవుతున్నాడు. ఇట్లా కుంటివలె పురుషుడికి దర్శనశక్తివున్నది గాని క్రియాశక్తిలేదు. అంధుడికివలె ప్రధానానికి క్రియాశక్తివున్నది గాని దర్శనశక్తి లేదు.) అని.

ఈశ్వర కృష్ణసాంఖ్యకారికలోను గౌడపాదభాష్యంలోను వున్న సంగతిని తెలిపి భారతీయసంస్కారం ఆంధ్రులకువుంటే యిట్లాటి నూతన చిత్రాలు బంగాళీలకంటె యెక్కువగా చిత్రించగలరన్నాను.

ఇప్పుడు భారతీయవిజ్ఞానం సంస్కృతభాషలో గుప్తమైవున్నది. ప్రస్తుతం భారతీయసంస్కారంతో అంటే సంస్కృతంతో యేమాత్రమైనా పాఠశాలల్లో కళాశాలల్లోబహువిద్యార్థులకు పరిచయం కలిగించే

విద్యాక్రమం అత్యంతం ఆవశ్యకం. ఉదాత్తవాఙ్మయంగల ప్రసిద్ధప్రాచీన భాషల్లో దేనినైనాపాఠశాలలోగాని కళాశాలలోగాని విద్యార్థి చదివి తీరవలెననే యేర్పాటుంటేనేగాని ఆదశ సిద్ధించదు.

మనదేశంలో అట్లాటి శుభచిహ్నలుగాని సంస్కారోదయమవు తున్నదనే ఆశగాని లేదంటున్నాను. ఇకముందేర్పడుతుందేమో చెప్ప లేను. బొంబాయి కలకత్తా విశ్వవిద్యాలయాలతో అక్కడి విజ్ఞానో న్మేషంతో ఇక్కడి ఆంధ్రమద్రాసు విశ్వవిద్యాలయాలకు ఇక్కడి సం స్కారదారిద్ర్యానికి సాదృశ్యంలేదు. కనుక మనము మురిసి చంకలు కొట్టుకొనడం అవివేకం. పులుముడు, అయోమయం, చిల్లరశృంగారం, శబ్దవాచ్యత దృష్టిసంకోచం, హీనదశను తెలుపుతున్నవంటున్నాను. ఇట్లాటి క్షుద్రకృతులు బంగాళీలలోవున్నా మరాటీలలోవున్నా హిం దీలోవున్నా యెక్కడవున్నా సత్యసిద్ధాంతాలను అతిక్రమించజాలవు. దోషం యెక్కడవున్నా దోషమేగాని గుణంకాదు. పాశ్చాత్యులకు పైనచెప్పినవి గుణమేమోగాని కావ్యప్రస్థానం మహోచ్చదశ నందిన భారతీయులకు మాత్రం అవన్నీ దోషాలేనని స్పష్టపరచాను.

అని శ్రీ......ఉమాకాన్తవిద్యాశేఖరకృతిలో వాఙ్మయసూత్రపరిశిష్టంలో
చిహ్నాధికరణం సమాప్తం.



శ్రీగణేశాయ నమః.

# వాఙ్మయ పరిశిష్టభాష్యం.

## బుద్ధ్యధికరణం.

### పూర్వపక్షం.

అవునయ్యా, ఇవి ప్రజాప్రభుత్వపురోజులు యెవరిబుద్ధికి తోచినట్లు వాండ్లు వ్రాస్తారు అంటారా?

### సమాధానం.

చెప్పుతున్నాను. ప్రజాప్రభుత్వమైనా మరేప్రభుత్వమైనా చదువుకోకుండా వుండడమే ప్రజాప్రభుత్వపు లక్షణమనుకోనడం అనుచితం. ప్రజాప్రభుత్వం ఉచ్చదశలోవున్న దేశాల్లో సయితం విద్యాస్థానాలు, ఆచార్యులు, విద్యాభ్యాసం ఇవన్నీవున్నవి. వారివారి దేశీయమైన సంస్కారాన్ని వారువారు పొందుతున్నారు. దానికి అనుషంగికంగా విదేశీయసంస్కారం పొందుతారు. అట్లానే మనవిద్యాస్థానాల్లో భారతీయసంస్కారంపొంది, దానికి ఉపోద్బలంగా విదేశీయసంస్కారం గూడాపొంది, తరువాత యేమైనా చెప్పండి, పత్రికాప్రవర్తకులుగాండి, కృతికర్తలుగాండి, చిత్రకారులుగాండి, యెవరైనాగాండి అప్పుడు ఆకార్యాలు దేశానికి హితమాపాదిస్తవి అని చెప్పుతున్నాను. భారతీయమేమిటి అంటారా? అదియేమో ఇక్కడ తర్కించడానికి అవకాశంలేదు. నాదృష్టిభేదాధికరణంలో పూర్తిగా వివరించాను. అక్కడ చూడవలెనని చెప్పుతున్నాను.

అని శ్రీ......ఉమాకాన్తవిద్యాశేఖరకృతిలో వాఙ్మయసూత్రపరిశిష్టంలో బుద్ధ్యధికరణం సమాప్తం.

శ్రీగణేశాయ నమః.

# వాఙ్మయపరిశిష్టభాష్యం.

## ప్రజాధికరణం.



### పూర్వపక్షం.

అవునయ్యా, మేము ప్రజలకు మేలుచేసేవారము, అందుకోసం యిట్లా తోచినదంతా వ్రాస్తాము అని అంటారా?

### సమాధానం.

నేను ప్రజలకు మేలుచేసే తరగతికి నన్ను నేనే యెక్కించుకొనలేనుగాని ప్రజల్లో ఒకడనని మాత్రం చెప్పుతున్నాను. ప్రజల్లో ఒకడనై మీరు వ్రాసేదంతా చిల్లరశృంగారం పులుముడు, శబ్దవాచ్యత, అయోమయం అని అది తుచ్ఛమని అంటున్నాను. మేము మేలుచేసేవారమని యింకా గర్వపడతారా? మేలు చేయదలచిన మీకు మేలు చేసేతరగతివాడినని నేను గర్వపడగలను. కాని యివన్నీ అసంబద్ధపు మాటలు. ఒకరికి మేలుచేయడానికి ముందు మిమ్మును మీరు బాగుచేసుకోండి అని చెప్పుతున్నాను.

"స్వయంతీర్ణః పరాం స్తారయతి."

అని హితం పెద్దలు చెప్పుతున్నారు. ప్రజలకు సేవజేయదలచితే భారతవర్షం సర్వోచ్ఛదశలో వున్నప్పటి మహాస్రష్టల వాల్మీకి వ్యాస కాళిదాసాదులకృతులు సుబోధమయ్యే పరిపాకం ప్రజలకు కలిగించడానికి యత్నించండి. అంతేగాని చిల్లర శృంగారం పులుముడు అయోమయంచూపి ప్రజలను వంచించ వద్దని చెప్పుతున్నాను.

అని శ్రీ...ఉమాకాన్తవిద్యాశేఖరకృతిలో వాఙ్మయసూత్రపరిశిష్టంలో ప్రజాధికరణం సమాప్తం.



శ్రీగణేశాయ నమః.

# వాఙ్మయపరిశిష్టభాష్యం.

## సమకాలాధికరణం.



### పూర్వపక్షం.

అవునయ్యా; సమకాలపువారలు మెచ్చరే గదా అని అన్నట్టు మీరు సమకాలికులు గనుక వీటిని మెచ్చరు.

"యేనామ కించిదిహనః ప్రథయంత్యవజ్ఞాం,
జానంతి తే కిమపితాన్ ప్రతినైషయత్నః,
యథాస్త్రీణాం తథావాచాంసాధుత్వేదుర్జనోజనః. ?"

అని భవభూతి,

"దిఙ్నాగానాం పథిపరిహరన్."

అని కాళిదాసు,

"మృద్వీకె మాకురు విషాదమనాదరేణ,
మాత్సర్య మగ్న మనసాం సహానాఖలానాం."

అని జగన్నాథుడు, ఈతీరుగా తమకావ్యాలనువిమర్శించేవారిని గురించి అన్నారు. మాకావ్యాలు మంచివేనంటారా?

### సమాధానం.

చెప్పుతున్నాను. క్షుద్రకులటలు సయితం ఈవాదం ఆధారం జేసుకొని పరిశుద్ధురాలైన సీతను లోకులు దూషించలేదా? అట్లానే మమ్మును దూషిస్తున్నారు. అని వాదించ వచ్చును గదా! ఇది అసంబద్ధ వాదం, ప్రాచీనుల్లో భవభూతి మొదలైన వారిని నిందించారు, నిజంగా కుత్సితకవులనూ నిందించారు. భవభూతి మొదలైనవారిని నిందించిన సంగతి విదితమే గనుక వాటిని మళ్లీ ఉదాహరించలేదు.

"అకీర్తివర్తనీం త్వేవం కుకవిత్వవిడంబనామ్." (కా. సూ. వృ.)
అని వామనుడు కుకవితను నిందిస్తున్నాడు.

" బూడిదెబుంగలై యొడలు పోడిమిదక్కి మొగంబు వెల్లనై
వాడల వాడలందిరిగి వారును వీరును చొచ్చుచోయనన్
గోడల గొందులందొదిగి కూయుచునుండెడి కొండవీటిలో
గాడిదె! నీవునుంగవివిగావుగదా అనుమానమయ్యెడున్."

(ప్రభాకరశాస్త్ర్యుదాహృతం!)

అని కుత్సితకవులు నిందితులవుతున్నారు. సమకాలపువారు నిందిస్తా రనేదే కావ్యానికి ఒక యోగ్యతగాదు. ఇట్లా వాదించడమే సవ్యభిచార మనే హేత్వాభాసమని నైయాయికులు చెప్పుతున్నారు.

ఈ హేత్వాభాసమిది. వీరు ఉత్తమకవులు సమకాలంలో నిందితులు గనుక, భవభూతి కాళిదాసాదులవలె, అని వీరివాదం. ఈవాదంతోనే అధమకవులనిగూడా తేల్చవచ్చును.

వీరు అధమకవులు, సమకాలంలో నిందితులు గనుక, కొండవీటి గాడిదెవలె ఈతీరుగా పరస్పరవిరుద్ధమైన రెండుసిద్ధాంతాలు తేలుతున్నవి. గనుక ఈవాదం హేత్వాభాసంతో కూడివున్నదన్నాను. ఇప్పటి కృతు లనేకం పులుముడు, అయోమయం, చిల్లరశృంగారం మొదలైన దోషాలతో కూడినవని నేను విశదపరచాను. ఇవి ఆదోషాలతో నిండి వుండ లేదని వివరిస్తే, ఆమాటలు ఉచితమైన ప్రతివచనంగా వుంటే స్వీకరిస్తాను. మళ్లీ సమాధానంవుంటే చెప్పుతాను. లేదా ఆమాటలు శిరసా వహిస్తానంటున్నాను.

అని శ్రీ...ఉమాకాన్తవిద్యాశేఖరకృతిలో వాఙ్మయసూత్రపరిశిష్టంలో
సమకాలాధికరణం సమాప్తం.



శ్రీ గణేశాయ నమః.

# వాఙ్మయ పరిశిష్ట భాష్యం.

## ప్రకాశాధికరణం.



### పూర్వపక్షం.

మీరు గుణాలు కనబరచలేదు. మీారు దోషాలు ప్రదర్శిస్తు న్నారు. దోషాన్వేషణం మంచిదిగాదు. శివుడు విషం కంఠంలోఉంచి ప్రకాశానికి తీసుకొనిరాక చంద్రుణ్ని నెత్తినపెట్టుకొని ప్రకటిస్తున్నాడు. అట్లా మీరు దోషాలను దాచవలసింది. కాని దోషాలను ప్రకటిస్తు న్నారు. అని అంటారా?

### సమాధానం.

చెప్పుతున్నాను. శివుడి ఉదాహరణం, యాచకులు దానానికి పోయినప్పుడు దోషాలేవైనావుంటే క్షమించి మాగుణాలకే మెచ్చు కొని దానంజెయ్యమని చెప్పడానికి పనికివస్తుంది. శరణాగతులను కాపా డేటప్పుడు వారిదోషాలను గణించ నవసరంలేని సమయం వస్తుంది అట్లాటి సందర్భాల్లో దోషాన్వేషణం అనావశ్యకం. అందుకే

"దోషోయద్యపి తస్యస్యాత్ సతామే తదగర్హితం" (రా)

అని విభీషణుడి విషయంలో శ్రీరాము డంటాడు. కాని కావ్యవిచా రణలో దోషనిర్ణయం అవశ్యకమే అవుతున్నది. కాకుంటే సాహిత్య గ్రంథాల్లో దోషప్రకరణమే అనుచితమై వుంటుంది.

"తదల్ప మపినోపేక్ష్యం కావ్యే దుష్టం కదాచన,
స్యాద్వపుః సుందరమపి శ్విత్రేణైకేనదుర్భగం." (కా. ద)

(కావ్యంలో దోషం కొద్దిదైనా ఉపేక్షించరాదు. శరీరం సుందరమైనదైనా ఒక్క కుష్ఠంచేత దుర్భగమవుతుంది.)
అని దండి అంటున్నాడు.

"సభాంవాన ప్రవేష్టవ్యం వక్తవ్యంవా సమంజసం,
అబ్రువన్ విబ్రువన్ వాపి నరోభవతి కిల్బిషీ." (మను.)

(సభలో ప్రవేశించరాదు. ప్రవేశించిన తరువాత సత్యమే తెలుపవలెను. అసలుచెప్పకున్నా, వక్రమార్గంలో చెప్పినా నరుడు పాపి అవుతున్నాడు.) అని మనువుచెప్పుతున్నాడు. పులుముడు, అయోమయం, క్షుద్రశృంగారం మొదలైనవాటిచేత లోకం వంచిత మవుతున్న దని తెలిసినప్పుడుసత్యప్రకటనం ధర్మమని అనుకొంటున్నాను. ఇక గుణాలవిషయం నాకు కనబడ్డవరకు చెప్పినాను. మరేవైనా గుణాలువుంటే యెవరైనా చెప్పితేవింటాను. అవి దోషాలని స్థిరపడితే అవిదోషాలని విన్నవిస్తాను. గుణాలైతే సంతోషిస్తాను. మనవారు పరిణతబుద్ధులై సంస్కారపరిపాకంతో గుణవత్కావ్యాలు రచిస్తే యెవరికి ఆనందదాయకంగాదు ?

అని శ్రీ...ఉమాకాన్తవిద్యాశేఖరకృతిలో వాఙ్మయసూత్రపరిశిష్టంలో ప్రకాశాధికరణం సమాప్తం.

శ్రీ గణేశాయ నమః.

# వాఙ్మయ పరిశిష్ట భాష్యం.

## ఇచ్ఛాధికరణం

అవునయ్యా; మీ రేమన్నా చెప్పండి! మాయిష్టమైనది మేము వ్రాస్తాము. మాకీవిచారణలతో పనిలేదు. అదే ఉత్తమకవిత్వమంటాము అని అంటారా?

## సమాధానం.

వివరిస్తాను. అవును. ఇష్టం వచ్చినట్లనవచ్చును. అందుకే
"స్వాధీనోరసనాంచలః పరిచితాః శబ్దాః కియంతః క్వచిత్,
క్షోణీంద్రోననియామకః పరిషదః శాంతాః స్వతంత్రంజగత్
తద్యూయంకవయోవయంవయమితి ప్రస్తావనాహుంకృతి
స్వచ్ఛందం ప్రతిసద్మగర్జతవయం మూకవ్రతాలంబినః."
(సా. ద. పీఠికలో ఉదాహృతం.)

నాలికస్వాధీనం, కొన్ని శబ్దాలు పరిచితమైవున్నవి, యెక్కడా రాజునియామకుడు లేడు, పరిషత్తులు శాంతంగావున్నవి, కనుక మేముకవులమంటే మేముకవులమని ప్రతిగృహంలో మీరింకగర్జించండి మేము మౌనంగా వుంటాము అని బుధులన్నట్లు అసంబద్ధాలాపాలను ఉపేక్షించవచ్చును. లేదా లోకం వంచితమవుతున్నదని తెలిసినప్పుడు దీని తత్వమిది యాథార్థ్యమిది అని సత్యాన్ని ఆరాధిస్తూ సత్యపరతంత్రులు చెప్పవచ్చును.

అని శ్రీ...ఉమాకాన్తవిద్యాశేఖరకృతిలో వాఙ్మయసూత్రపరిశిష్టంలో ఇచ్ఛాధికరణం సమాప్తం.

శ్రీ గణేశాయ నమః.

# వాఙ్మయ పరిశిష్ట భాష్యం.

## సంస్కారాధికరణం.

నేటికాలపు కవిత్వాన్ని విచారణచేసి అభిప్రాయికంగా దృష్టి సంకోచంచేత హీనంగా వున్నదని, వులుముడు, అయోమయం, శబ్ద

వాచ్యత మొదలైన దోషాలతో దూషితమైనదని, నేటకాలపు కృతులు ప్రాయికంగా చిల్లరశృంగారమని క్షుద్రాలని కావ్యంపతితదశలో వున్నదని విశదపరచాను. సాతవాహనుల కాలం శతశతాబ్దులకింద గడచింది. వోరంగల్లు వైభవం విశేషబలప్రదంకాకుండానే అంతరించింది. తరువాత ఆంధ్రులు భారతవర్షంలో అజ్ఞాతసీమల్లో అణిగిపోయినారు. దక్షిణాన కాంచి, మధుర, ఉత్తరాన ఇంద్రప్రస్థం, ఉజ్జయినీ, కౌశాంబి, పాటలీపుత్రం, విదిశ, ధార మొదలైన నగరరాజాలవలె సర్వభారతవర్షాన్ని ఆకర్షించిన మహారాజధానులకుగాని, రామేశ్వరం, ప్రయాగ, అయోధ్య, ద్వారక మొదలైనపట్టణాలవలె సర్వభారతవర్షం సన్నివిష్టమయ్యే మహాక్షేత్రాలకుగాని, నవద్వీపం, కాశి, కాశ్మీర శారదాపీఠం మొదలైన పవిత్రస్థలాలవలె సర్వభారతవర్షాన్ని పాదాక్రాంతం జేసిన మహావిద్యాస్థానాలకుగాని ఆంధ్రదేశం ఆకరంగాలేదు. రెడ్లకింద కొంచెం తలయెత్తనారంభించితిరిగి పైవోపహతియయింది. వెనక చాళుక్యుల చేతిలోవలె, రాజ్యాలగతులు క్షణక్షణం వ్యత్యస్తమయి క్షుబ్ధావస్థయందున్న దశలో విదేశీయులైన విజయనగరరాజుల వశమైనాము. పురాణేతిహాసాలఛాయలు, సంస్కృతిచ్ఛందస్సులతో పులుముడు భాషావ్యతిక్రమం ఛందోభంగం మొదలైన ఘోరదోషాలతో నిర్బద్ధ వళిప్రాసల అనర్థాలతో నిండిన మనువసు చరిత్రలవంటి క్షుద్రకావ్యాలే మనకు సర్వభారతీయసంస్కారమై, పద్యం వ్రాయడమే కవిత్వమయింది. అదే పరమవిద్య అయింది. ఆపద్యంసయితం అశాస్త్రీయమైన మరికిలక్షణాలతో వికృతమైంది. ఈతీరుగాభారతవర్షంలో అధములమై భారతీయ విజ్ఞానానికి దూరులమై వంచితులమైనాము. దేశంలో భారతీయ సంస్కారప్రవాహాలు యింకిపోయినవి. విద్యాపీఠాలు అస్తమించినవి. గురుకులాలు రూపుమాసినవి. భారతీయసంస్కారం లేని కేవలపాశ్చాత్యసంస్కారం బలప్రదంగాక ఆత్మవిముఖత్వాన్ని

పరసంస్కారదాస్యాన్ని మనకు ఆపాదించినవి. ఈదశలో ఆంధ్రదేశంలో వెలువడుతున్న కృతులు యెండునేలను మొలచిన గిటకగడ్డివలెను, యిమడక వెళ్లిపోయిన ఆహారంవలెను వుండవలసివచ్చినవి. బురదగుంట నుండి పైకివచ్చిస్నానాళల్లానికి శుద్ధజలం లభించకతిరిగే పతితుడివలె పంకిలమైన అపరిణతబుద్ధులతో కృతుల రచనలుచేస్తున్నాము. దేశీయవిద్యాశాలలుగానీ రాజకీయవిద్యాశాలలుగానీ భారతీయసంస్కారం నిర్బంధంగా, ప్రధానంగా,విదేశీయసంస్కారం అంగంగా దేశీయులకు ప్రసాదించినప్పుడే యీపంకిం మనకు తొలగి మనం స్వచ్ఛదీప్తితో భారతజాతుల్లో ఉత్తమస్థానంఆక్రమించగలము. నన్నయాదుల భారతంమొదలైనవి భారతీయ సంస్కారంయొక్క శుద్ధస్వరూపం కావంటున్నాను. భారతీయ సంస్కార పరిపాకంపొంది స్వచ్ఛ దీప్తితో భారతజాతుల్లో ఉత్తమస్థానం ఆక్రమించ గలిగినప్పటి కృతులుగానిచిత్రాలుగాని మరేవిగాని మరేవిగాని ఒక ఆంధ్రులనేగాక సర్వభారతవర్షాన్ని సర్వలోకాన్ని నూతనసందేశాలతో పవిత్రం చేయగలవు! అనిమిషానికే నేను ప్రతీక్షిస్తున్నాను. జన్మాంతరంలోనైనా ఆనిర్మలదశ చూడగలననే ఆశతో విశ్వాసంతో ఆంధ్రులసంస్కారానికి సేవను ఆకాంక్షిస్తున్నాను.

అని శ్రీ...ఉమాకాన్తవిద్యాశేఖరకృతిలో వాఙ్మయసూత్రపరిశిష్టంలో
నేటికాలపుకవిత్వమనే ప్రథమాధ్యాయంలో
సంస్కారాధికరణం సమాప్తం.

అధ్యాయంగూడా సమాప్తం.



చెన్నపురి : శ్రీ 'రామ' ముద్రాక్షరశాలయందు ముద్రితము—1928.

శ్రీగురుభ్యోనమః హరిః ఓమ్.

ఈకృతిలో సంజ్ఞావాచకాదులు ఉదాహృతమైన

# పుటల సూచిక.




అభినవగుప్తపాదులు 9, 52, 161, 168.
అప్పకవి 31
అహోబలుడు 42, 56
అభారతీయవర్గం 53
అభారతీయులు 77
అద్వైతం 81
అనువాకం 79
అథర్వవేదం 81
ఆనార్కాలి 131, 133, 142
అవతారమూర్తులు 133
అధికార్లసూర్యనారాయణ ... ...159, 184, 193
అయోధ్యాకాండం...166
అగ్నివర్ణుడు 176
అగ్నిమిత్రుడు 178
అయోధ్య 215, 277
అగ్నిపురాణం 262
అంకాళమ్మ 50
అభినవాంధ్రకవిమండలి 231
అడివిబాపిరాజు 253
అనసూయ 253
ఆనందవర్ధనుడు 3, 8, 9, 92, 94, 97, 166, 168, 255
ఆంధ్ర 3,5,6,7, 76, 77, 89,128, 135, 138,142,149, 156, 237, 242,251, 262,264, 266,267, 277,278, 279
ఆంధ్రహేరాల్డు 7, 61, 109,122, 142, 150.
ఆంధ్రభారతి 133
ఆంధ్రపత్రిక 261
ఆంధ్రవిశ్వవిద్యాలయం 269
ఆంధ్రకళాశాల 268
ఆంధ్రపండితమండలి 254
ఆశ 42
ఆగ్నేయపురాణకారుడు 92
ఆముక్తమాల్యద 140
ఆర్యావర్తం 248
Arthur Symons / ఆర్థరుసైమన్సు 250
ఆర్యులు 261, 264
ఆనందముద్రాలయం 267
ఇంగ్లీషు 5, 145, 146, 153, 215, 219, 237, 250, 253, 259
ఇంద్రజననీయం 47
ఉపనిషత్తు 76, 79, 163, 217
ఉపస్తి 163
ఉత్తరరామచరిత్ర 178, 181, 185, 250, 251
ఋగ్వేదం 81, 82
ఋతుసంహారం 212
Encyclopedia Brittanica 146

ఏ. వి. నరసింహంపంతులు 133
ఐతరేయోపనిషత్తు 165
ఓరోరిబండోడపాట 2.2
కళిక 131
కవిజనమనోభిరామం 45
కణాదుడు 77
కపిలుడు 77
కనకవల్లి 131, 134
కవిజిజ్ఞాస 134, 136
కవికొండలవెంకట్రావు 160, 185
కర్మమీమాంస 165
కపింజలుడు 178
కలిశకం 251
కంచనపల్లికనకమ్మ 262
కల్పద్రుమం 262
కలకత్తావిశ్వవిద్యాలయం 269
కాళిదాసు 10, 18, 24, 25, 28, 42, 55,57,58,59, 69, 73, 74, 75, 89, 92, 93, 106, 107, 112, 114, 116 117, 123,125,152, 161, 165, 168 176, 177,182, 186, 191,193 194, 202, 203,205, 229,238.252, 271, 272, 273.
కావ్యకుసుమావళి 6, 8,9, 133, 255
కావ్యమీమాంస 13
కాపిలం 69, 81
కాణాదం 69, 181
కావ్యప్రకాశకారుడు 98, 195
కాశీఖండం 107
కావ్యప్రదీపం 119, 120
కాదంబరి 58, 118, 177
కాళహస్తీశ్వరశతకం 144, 145, 212
కామసూత్రం 204
కాంచి 277
కాశి 277
కాశ్మీరశారదాపీఠం 277
కిరాతార్జునీయం 47
కువిందుడు 14
కుమారసంభవం 42,47,75,118, 176,185 185, 205, 238
కుమారిలభట్టాచార్యులు 75
కురుక్షేత్రం 149
కుమారస్వామిసో
మయాజి— 161, 168, 260, 261
కూడ్లి 39, 254
కూచినరసింహకృతి 41, 217
కృష్ణపక్షం 69, 23, 25, 27, 30, 32, 36 42,43,49,52, 60,66, 83, 86, 95, 99, 100,108, 110.111, 112, 122, 130, 132, 142, 253.
కృష్ణశాస్త్రి 7, 23, 27, 36, 39, 49
కృష్ణకర్ణామృతం 103, 135, 142, 212,
కృష్ణవేణి 215
కృష్ణానది 1, 215 [133
కేశిరాజువేంకటసుబ్బారాయకవి 131,
కైలాసం 251
కొమాండూరి కృష్ణమాచార్యులు 29, 95, 213
కొక్కొండ వేంకటరత్నశర్మ 30
కొండవీటిగాడిద 273
కొరబొబ్బిలి 149
కోల్రిడ్జి Coleridge } 241, 251
కౌశాంబి 277
ఖండనఖండఖాద్యం 46, 76
గంగాదేవి 28, 93
గవర్నరుపేట 218
గరికపాడు 247 [254
గంటిసూర్యనారాయణశాస్త్రి 158, 164
గరిగిపాటి రామమూర్తి 36, 122 160,184

గీతరఘునందనం 30
గీతగోవిందం 135
గీతం 135
గ్రీకు 248
గ్రీసుదేశం 247, 248
గురుజాడఅప్పారావు 31
Gregg, Walter W / గ్రెగు 241
గొల్లపూడి శ్రీరామశాస్త్రి 259, 261
గోదావరి 1, 239, 250
గోపిక 200
గౌరి 238
గౌడపాదభాష్యం 268
ఘటకర్పరకావ్యం 144, 145
ఘట్టకుటీప్రభాత 226
చంద్రుడు 219, 274
చంద్రమ 233, 235
చళుక్య 107
చార్వాకుడు 59
చారుదత్తుడు 178
చార్లస్ యెడ్విన్ వాహన్ / Charles Edwin Vaughan 251
చాళుక్యులు 277
చాసరు / Chaucer 249
చిత్రనళీయం 41
చెన్నపట్టణంలో 191, 212
చోడవరపుజానకిరామయ్య 160, 184
ఛాందోగ్యం 161
జగకవి 25
జగన్నాథుడు 26, 39, 107, 205, 260, 272
జడకుచ్చులు 45, 47
జయదేవుడు 93
జంధ్యాలశివన్నశాస్త్రి 121
జనమంచి శేషాద్రిశర్మ 130, 133, 141
జయమంగళుడు 204
జనకుడు 234
జానపాటి పట్టాభిరామశాస్త్రి 134
జానకి 178
జి. యస్. శాస్త్రి 158, 254
జీవయాత్ర 262
జీవితాదర్శం 132, 134
జ్యోతి 254
జైమిని 69, 77, 81, 165
టేకు 251
ట్రేజడీ 209
తంత్రవార్తికం 75
తాటక 111
తారాశశాంకవిజయం 211
తార 171
తిమ్మయ 30
తిరుమలకవి 30
తిక్కన 30, 143, 266
తిరుమలేశపద్యాలు 86
త్రిశతి 135, 180
త్రిలింగ 1
త్రిలింగపత్రిక 261
తుషాదుడు 218
తుంగభద్ర 1
తృణకంకణం 15, 150
తె. కృష్ణమూర్తి 109
తెనాలి 239
తెలుగు 135, 136, 148, 149, 224, 251, 253
తెలగపత్రిక 261
తేకుమళ్లరాజగోపాలరావు 131, 134
తేవప్పెరుమాళ్లయ్య 267
తైత్తిరీయారణ్యకం 238
తొలకరిపత్రిక 150
తొలకరి 30

దశరూపకం 34, 114, 227
దశిక సూర్యప్రకాశరావు 7, 23, 40
దమయంతి 42
దత్త 48
దండక 238
దండి 262, 275
దర్పణవ్యాఖ్యాత 149
దారకుడు 41
దాశరథిశతకం 126
ద్వారక 277
దాక్షారామం 107
ద్విపదరామాయణం 30
ద్విపదభారతం 30
ద్విరదగతిరగడ 31
ద్విపద 135
ద్వివేదులు 275
దువ్వూరిరామిరెడ్డి 131, 134
దుష్యంత 133, 152, 177, 205
దేవదత్త 48
దేవీపంచరత్నాలు 81
దేవదూత 217, 218
ద్రౌపది 170
ధర్మాంగదచరిత్ర 29
ధ్వన్యాలోకం 52
ధ్వనికారుడు 1, 95, 167
ధనికుడు 114
ధనదుడు 262
ధార 277
ధ్యానగీతికర్త 78, 81, 82, 86
ధూర్జటి 212
నన్నయ 3, 25, 30, 129, 131, 251
266, 238, 267
నలచరిత్రం 29
నలుడు 42, 179
నందకులం 57
నవద్వీపం 277
నారాయణమ్మనాయుడు బావపాట 6, 9, 211, 231
న్యాయకుసుమాంజలి 46,
నాట్యశాస్త్రం 88
నారదుడు 90
నాయని సుబ్బారావు 121, 159, 184
నాగరఖండం 134
నాయుడు 158, 186, 212, 219, 220,
223, 224, 226
నాదెండ్ల వెంకట్రావు 160, 184
నారాయణమ్మ 189, 211
నాయుడుబావ 189, 211
నాయకురాలు 221
నిడమర్తి సత్యనారాయణమూర్తి 7, 151
నిర్వేదం 142
నిరృతి 262
నైమిశారణ్యం 218, 238, 250
నైయాయిక 69, 273
పతంజలి 10, 48, 77, 87
పఠాను 42
ప్రబోధం 42
పరమహంస 46
ప్రతిభ 59, 75
ప్రభాకరుడు 76
పరమేశ్వరుడు, శివుడు 90, 152, 175, 176, 177, 181, 182, 194, 205, 182, 274
పరీక్షి 191, 212
ప్రహ్లాదుడు 125
పయిడిపాటి చలపతిరావు 121
పం. రామచంద్రరావు 132, 134
ప్రణయరాధిక 132
ప్రణయగీతములు 133
పసుమర్తి అనంతపద్మనాభం 133

ప్రణయాంజలి 156
ప్రయాగ 277
ప్రణయజానకి 158, 159, 168
ప్రణయగీత 158, 159, 168, 191
ప్రణయినీగీత 158
ప్రణయసౌధం 158, 159, 185, 191
ప్రణయోన్మాదం 160
ప్రణయగానం 168
ప్రకాశం 211
ప్రభాకరశాస్త్రి 273
ప్రమథనాథ 1
పంచాక్షరి 180
పాపాయి 27
పాదుకాస్తవం 29 95, 212
పాణిని 47, 87, 132, 150, 160
పావకుడు 41, 218
పాతంజలం 69, 81
ప్రాకృత 224
పార్సీలు 82
పార్వతి 90, 175, 176, 177, 181
పాల్కురికి సోమన్న 96
పాపినేని వేంకటేశ్వరరావు 121
పాశ్చాత్య 2, 144, 217, 218, 223, 240 247, 259, 265, 269, 278
పారాశర్యోపపురాణం 167
పాస్టరల్ Pastoral } 237, 240, 241
Pastoral Poetry and Pastoral Drama పాస్టరల్ పోయట్రి అండ్ పాస్టరల్ డ్రామా. } 241
పినాకిని 1
పుష్పమాల 131, 134
పురాణం సూరిశాస్త్రి, 7, 150
పుండరీకుడు 178
పువ్వాడ శేషగిరిరావు 160, 184
పెద్దన 3
పెద్దిభట్ల రామచంద్రరావు 110,142
పెనుమర్తి వేంకటరత్నం 110
పెమ్మరాజులక్ష్మీపతి 142
పైశాచం 224
పోతన 30, 125
పోలేరమ్మ 50
పౌరాణికం 69
బ్రహ్మయ్యశాస్త్రి 6, 145
బంగారు 30
బళ్లారి కృష్ణమాచార్యులు 41
బసవరాజు అప్పారావు 61
బ్రహ్మసూత్రం 76
బంగాళ 148, 259, 263, 264, 265, 268
బ్రహ్మమీమాంస 165
బదరీవనం 250
బందరు 268
బర్రు 251
బాణుడు 28, 95, 118 177
బాపిరాజతోలేటి 6, 7, 23, 39, 256
బాణిలశంభుదాసుడు 29
బాదరాయణుడు 69 217
బ్రాహ్మణభాగం 81
బిల్హణకావ్యం 144, 145
బిల్హణుడు 182, 254
బృహదారణ్యకం 238
బెజవాడ 217
బేకనుపన్యాసములు 133
బొంబాయి విశ్వవిద్యాలయం 269
బొమ్మకంటి నృసింహకవి 29
బోధాయనుడు 217
భవభూతి 10, 24, 52, 56, 86, 87, 107, 125,177,181,238, 250, 273, 272

భట్టతోతుడు 52
భగవద్గీత 68, 75, 76
భరతుడు 88, 166, 167
భర్తృహరి 94, 124, 125, 135, 163
170, 180 196
భ. రామసోమయాజులు 109, 122
భ. రాజేశ్వరరావు 133, 160
భట్టి 155
భరద్వాజుడు 166
భక్తచింతామణి 213
భారతి 6, 723, 26, 30, 36, 40, 109,
110,121,122,131, 132, 133, 136
142,151,158,159, 160, 168, 155,
191,211,212.213
భారతీయ 2,3,5,7, 9, 14, 17, 18, 19,
23,24,34, 47. 68, 87,149, 163,
166,179, 191,192,193, 194, 195,
199,202,203, 206,213, 224, 238,
241,250 258,263, 264, 266, 267,
268, 269, 270.
భారతం 2, 3, 30, 45, 75, 129, 135
136, 137, 138, 266, 267, 278
భామినీవిలాసం 39
భావకవిత్వం 35, 65
భావకావ్యం 63, 212, 213
భాగవతం 79, 85, 125, 234,
భాష్యకార 262
భావధ్వని 212
భాగీరథి 250
భాస్కర 266, 267
భారతవర్షం 54, 75, 76, 89, 153, 178
217, 218. 238, 242, 243, 248, 250,
251, 252, 277, 279
భీమపురం 42
భీమవరం 107
భోగరాజునారాయణమూర్తి 131, 133
మమ్మటుడు, 19,22, 42, 147, 149, 169,
మనువు 24, 193, 194, 203, 275
మగధదేశం 14
మనుచరిత్ర 3, 48, 149, 267
మహాభాష్య 48
మహాభారతం 65
మంత్రభాగం 81
మహిమ్నస్తోత్రం 149
మలయకేతువు 57
మహారాష్ట్రులు 148
మల్లాది వేంకటకృష్ణశర్మ 261
మండనుడు 165
మహాశ్వేత 178
మహాత్ముడు 266
మధుర 277
మద్రాసు విశ్వవిద్యాలయం 267, 269,
మరాఠీ 264, 269.
మాధవాచార్యుడు 59, 76, 96
మాఘుడు 73, 97, 155
మాతృమందిరం 131, 218
మామునూరి నాగభూషణరావు. 159, 184
మాధవుడు 178
మాలతి 152
మాళవికాగ్నిమిత్రం 238
మానససరస్సు 240
మీమాంసకులు 10, 76
మీమాంసాసూత్రీయ శాబరభాష్యవ్యా
ఖ్యానం 75
ముత్యాలసరం 50
ముక్తావళి 46
ముక్కపాటి నరసింహశాస్త్రి 211
మురారి 24
ముద్రారాక్షసం 42, 56
మూగినోము 159, 193
మృచ్ఛకటిక 178

మేఘసందేశం 33, 52, 65, 118, 178
మైరావణచరిత్రం 30
యథావాల్మీకం 30
యమపఖీయం 47
యక్షుడు 52, 205, 237
యజుర్వేద 81
యాలపాటలు 32
యామర్తి సూర్యప్రకాశరావు 84, 110
యూరోపు 248, 250, 251, 252
యెంకిపాటలు 6, 27, 32, 42, 156, 157, 158, 160, 168, 186, 187, 188, 190, 191, 207, 208, 211, 212, 219, 221, 222, 224, 229, 230, 231, 234, 240, 241, 242, 244, 253, 254, 255, 265
యెంకయ్య చంద్రముపాట 7, 19, 32, 187, 188, 191, 208, 209, 212, 219, 222, 225, 229, 230, 231, 234, 235, 241, 244,
గోంకయ్య 233, 235
యెర్రాప్రగడ 30, 138, 266
యెంకి 158, 212, 220, 226, 227, 233
యేకాదశి 133
యేకాంతసేవ 6, 7, 9, 23, 32, 49, 81, 96, 99, 101, 105, 113, 253, 255, 265.
యోగ 163
రగడ 31, 35
రతీవిలాపం 42
రఘువంశం 45, 47, 65, 69, 93, 112, 153, 185, 238.
రసగంగాధరం 118
రసార్ణవసుధాకరం 118
రత్నాపణం 168, 260, 261
రవీంద్రుడు 266
రత్నం 30
రాజశేఖరుడు 13, 14
రామలింగారెడ్డి 7, 23, 29, 39, 150, 253 [255
రామాయణం 30, 45, 65, 153, 166, 226, 247, 266, 267
రామరాజు 42
రావణుడు 51, 69, 122, 170, 207
రామ 52, 56, 79, 91, 95, 111, 167, 170, 177, 179, 181, 207, 215, 226, 238, 247, 250, 274,
రాక్షసుడు 57
రామశరి 178
రామానుజుడు 76, 77
రాయప్రోలుసుబ్బారావు 78, 133
రామచంద్రతర్కవాగీశభట్టాచార్యుడు 119
రావుబహద్దరు కందుకూరి వీరేశలింగం పంతులు 133
రామకృష్ణ 219
రాజావేంకటాద్రి అప్పారావు బహద్దరు [254
రాధాకాంతుడు 262, 263
రామేశ్వరం 277
రూసో 251
రెడు 277
Romantic Poetry / రొమాంటిక్ 248, 250, 251, 252,
Romantic movement in English Poetry / రొమాంటిక్ మూవ్‌మెంట్ ఇన్ ఇంగ్లీష్ పొయట్రి 248,
రొమాంటిక్ రివోల్టు / Romantic Revolt 250
లక్ష్మీకాంతతోలకరి 6, 7, 23, 29, 39, [255
లక్ష్మణ 111, 226, 247
లక్ష్మి 211
లాటి 163
లాటిను 248
విరిక్సు 35, 144, 145, 146
లీలాశుకుడు 180

లోకమాన్య 46
లోచనకార 262
వనకుమారి 6, 9, 78, 131, 134, 156, 216, 217, 265
వనవాసి 41, 217, 218
వసుచరిత్ర 30, 149, 267
వడ్డాది సుబ్బారాయడు 213
వశిష్ఠుడు 73, 238
వర్ధ్నవరు 251
వరుణ 262
వాల్మీకి 15, 50, 51, 153, 161, 166, 207, 215, 238, 247, 250, 271
వాక్యపదీయకారుడు 10, 58
వ్యాసుడు 51, 68, 69, 77, 250, 271
వాక్యపదీయం 75
వాసంత 110
వాక్పతిరాజు 114
వా. గోపాలకృష్ణయ్య 132
వాసంతిక 219
వామనుడు 273
విద్యానాథుడు 3, 144, 145, 262
విశ్వనాథుడు 3, 65, 91 144, 145, 148
విరహోత్కంఠిత 29
విశ్వనాథసత్యనారాయణ 30, 131, 133, 142
వియోగరాగం 42
విరుద్ధభోజనీయం 47
విష్ణువు 69, 166
విచిత్రపాదుకాపట్టాభిషేకం 130, 133, 140
విద్యార్థిపత్రిక 132
వి. యస్. శర్మ 133
విభీషణుడు 207, 274
విక్రమోర్వశీయం 238
వింధ్యాచలం 250
విదిశ 277,
విజయనగరరాజులు 278
వీరబ్రహ్మ 77, 234
వృషభగతిరగడ 31
వృత్తికార 262
వెండి 30
వేమన్న 77. 83, 135, 159
వేమారెడ్డి 107
వేంకటపార్వతీశ్వరకవులు 131, 133, 142, 218, 253, 255
వేదులసత్యనారాయణశాస్త్రి 160, 184
వేదాంత 163
వేదపురుషుడు 161
వేనుడు 178
వేంకటేశవచనాలు 212
వైద్యనాథుడు 120
వైయాకరణులు 81
వోరంగల్లు 277
శంకరులు 20, 21, 75, 76, 77, 81, 85, 165
శబ్దబ్రహ్మవాదం 81
శబరి 153
శాకుంతలం 33, 42 ,75, 118, 177, 178, 238
శారదారంజనరాయలు 262, 263
శిశునాగుడు 14
శిశుక్రందీయం 47
శివరామదీక్షితులు 77
శివుడు 274, 182
శ్రీహర్షుడు 25, 76, 104
శ్రీనాథుడు 25, 29, 30, 103, 107, 135, 143, 221, 222, 256
శ్రీగుణరత్నకోశం 88
శ్రీరాం రామబ్రహ్మకృతి 118
శ్రీశైలం 155
శుద్ధధరమండలి 74
శ్రుతికారుడు 81

శృంగారశ్రీనాథం 118
శృంగారకాదంబరి 118
శృంగారనైషధం 118
శృంగారం 159, 160, 168, 241
షేక్స్పియరు 217, 249
సంస్కృతం 5, 7, 9, 128, 129, 132, 134, 135, 136, 148, 150, 223, 224, 226, 267, 268
సంధ్యారాగం 45
సత్యభామ 48
సర్వదర్శనసంగ్రహం 59
సర్వదర్శిలోలక్కులు 191
సాతవాహనుడు 13, 277
సారంగధరచరిత్ర 29
సాహిత్యదర్పణకారుడు 30, 65, 110, 145, 148, 149, 171 205, 227
సాహితి 35, 42, 61, 254
సారంగధర 41
స్వారోచిషమనుసంభవం 48
సామవేదం 81
సాంఖ్య 163, 268
సాంఖ్యకారిక 268
సిద్ధాంతకౌముది 46
సిద్దప్ప 77
సి. యస్. జయరావు 131, 134
సీత 91, 94, 95, 122, 152, 166, 170, 171, 250, 272
స్వీయచరిత్రం 133
సుజాత 132, 133
సుసర్ల అనంతరావు 133
సుజనరంజని 254
సూర్యుడు 219
సూర్యశతకం 144, 145, 212
సెలయేటిగానం 47
స్నేహలత 133
హయప్రచారరగడ 31
హరిణగతిరగడ 42
హంసయోగిభాష్యం 75
హంసయోగి 75
హరివంశం 138
హారిట్టు 218
హనుమంతుడు 226
హార్డరు 252
హి. మాలయం 250, 266
హిందీ 263, 264, 269
హేలారాజు 75



# పండిత శ్రీ ఉమాకాన్త విద్యాశేఖరుల కృతులు.

## విమర్శములు.

1 నైషధతత్త్వజిజ్ఞాస — 0 6
2 శ్రీరామాయణ మహాభారతవిమర్శవిచారణ — 0 6
1,2,10 (తెలుగు దేశమందలి చండాలురు అనే పుస్తకము) చేర్చిన సంపుటము, గట్టిబైండు — 1 2
3 విషూచితీయసభ, వరూధినీ ప్రవరాఖ్యులరతిపరామర్శము — 0 4
4 గజడదబల గసడదవల విచారణ, ఆంధ్రజాతికి రాష్ట్రభాష హిందీ భాషగాదు, స్మరణములు — 0 4
5 శాసనములు, మనుచరిత్ర రేవణ — 0 2
3,4,5 చేర్చిన సంపుటము, గట్టిబైండు — 0 12
6 వాఙ్మయదర్శనము (సిద్ధమవుతున్నది) 7 ప్రేమపరిణామము (సిద్ధమవుతున్నది)

## సాహిత్యము.

8 రసమీమాంస సిద్ధమవుతున్నది
9 చంద్రాలోక వివరణము — 0 6
10 నేటికాలపుకవిత్వం — 2 8

## ధర్మశాస్త్రము.

11 తెలుగుదేశమందలి చండాలురు — 0 4

## కథలు, చరిత్రలు, నవలలు.

12 పల్నాటివీరచరిత్ర - శ్రీనాథకృతి — 1 4
13 అరవదేశమందలి ఆంధ్రవాఙ్మయము — 0 4
14 శ్రుతిరంజని — 0 2
15 Foreign Connection of Buddha — 0 4
16 పల్నాటివీరుల కథలు — 0 8
17 షేక్స్పియరు నాటకకథలు — 1 8
18 త్రిలింగ చిన్నకథలు — 0 8
19 టిప్పుసుల్తాను — 1 4

## వ్యాకరణశాస్త్రము.

20 సంస్కృత వ్యాకరణ ప్రదీపము (కారకం వరకు) — 0 8
21 పాణినీయము, సాంధ్ర వివరణము, 9 సంచికలసంపుటము, గట్టిబైండు — 3 0
22 వ్యాకరణము వృత్తిసహితము (తెలుగుభాషకు) సిద్ధమవుతున్నది

## తర్కశాస్త్రము.

న్యాయదర్శనము - శ్రీలక్ష్మణరాయకృతి (ప్రథమాధ్యాయము) — 0 12
వైశేషికదర్శనము. శ్రీ మేడేపల్లి వెంకటరమణాచార్యకృతి (ప్రథమాధ్యాయము) — 0 12

కావలసినవారు:— వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.
(అని గానీ, లేక)
మేనేజరు, తెలుగుదేశవాఙ్మయసమితి,
తిరువల్లిక్కేణి, మద్రాసు.

